**Nufqa-e-Mutallaqa**
**Ek Ilmee jaiza (Telugu)**

# ఇస్లాంలో భరణం


మూలం

**మౌలానా సయ్యద్ జలాలుద్దీన్ ఉమ్రీ**

అనువాదం

**యస్. గౌస్ మొహియుద్దీన్**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# సుప్రీం కోర్టు తీర్పు

**సారాంశం:** తలాఖ్ పొందిన స్త్రీ, తన భర్త నుండి భరణం పొంద వచ్చు.

పై తీర్పుకు సంబంధించిన వ్యాజ్యపు వివరాలు: ముహమ్మద్ అహ్మద్ ఖాన్ వివాహం 1932లో షాహ్‌బాను బేగంతో జరిగింది. వారు 43 సంవత్సరాలు దాంపత్య జీవితం గడిపిన తరువాత 1975లో భర్త తన భార్యను ఇంటినుండి గెంటివేశాడు. ఏప్రిల్ 1978లో షాహ్‌బాను బేగం తన భర్తకు ప్రతికూలంగా ఇండోర్ (మధ్యప్రదేశ్) జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ న్యాయస్థానంలో క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 125 ప్రకారం ఆక్షేపణను దాఖలు చేసింది. అందులో ఆమె తన భర్త నుండి నెలకు రూ.500లు చొప్పున భరణం ఇప్పించ వలసిందిగా విన్నవించుకుంది. ఆగష్టు 1979లో జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ వారు షాహ్‌బాను బేగంకు నెలకు రూ.125లు చొప్పున భరణం చెల్లించవలసిందిగా ముహమ్మద్ అహ్‌మద్‌ఖాన్‌ను ఆదేశిస్తూ తీర్పునిచ్చారు. 6 నవంబరు, 1985న ముహమ్మద్ అహ్మద్ ఖాన్, షాహ్‌బానుబేగమ్‌కు తలాఖె ముగల్లజా ఇచ్చాడు. దావాదారురాలు భరణం కోసం వేసిన వ్యాజ్యానికి బదులుగా ముహమ్మద్ అహ్మద్ ఖాన్ తలాఖె ముగల్లజా ఇచ్చిన తరువాత ఆమె తన భార్య కాదు. కాబట్టి ఆమెకు భరణం చెల్లించవలసిన బాధ్యత తనపై ఉండదు అనే కారణాన్ని చూపుతూ జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ వారి తీర్పును పునఃపరిశీలించవలసిందిగా

కోరుతూ మధ్యప్రదేశ్ హైకోర్టును ఆశ్రయించాడు. హైకోర్టు జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ వారి తీర్పును బలపరచటమే కాకుండా, భరణంగా చెల్లించవలసిన మొత్తాన్ని రూ. 125 నుండి రూ. 179-20 పైసలుగా నిర్ణయించింది. ముహమ్మద్ అహ్మద్ ఖాన్ హైకోర్టు తీర్పు తనకు సంతృప్తికరంగా లేనందున సుప్రీం కోర్టులో ప్రత్యేక అప్పీలు వేశాడు. అయిదుగురు న్యాయమూర్తులతో కూడిన రాజ్యాంగ ధర్మాసనం ఈ ప్రత్యేక అప్పీలుపై సుదీర్ఘంగా విచారించిన పిదప మధ్యప్రదేశ్ హైకోర్టు తీర్పును ధృవపరుస్తూ ప్రత్యేక అప్పీలును కొట్టివేసింది. ఇంకా విడాకులు పొందిన ముస్లిం స్త్రీ ఇద్దత్ కాలం గడిచిన తరువాత కూడా భరణం పొందే హక్కును కలిగి ఉంటుందనే తీర్పులో మార్పు చేయలేదు. ఈ తీర్పు ఏప్రిల్ 1985లో ప్రజల సమక్షంలో వెలువడింది.

*('దావత్ పత్రిక: 'ముస్లిం పర్సనల్ లా ప్రత్యేక సంచిక' జూన్ -12, 1985. పీఠిక పరిచయపు సంగ్రహము.)*

# ఇస్లాంలో భరణం

*ఈ వ్యాసం 'తహ్కీకాతె ఇస్లామి' అలీగఢ్ (జులై-సెప్టెంబరు-1985) త్రైమాసిక పత్రిక సంచికలో ప్రచురించబడింది. సార్వజనీక ప్రయోజన నిమిత్తం అందులోని కొన్ని ఫికహ్ (ధర్మశాస్త్ర) వాద విషయాలను వదలిపెడుతూ పుస్తక రూపంలో ప్రచురించబడుతున్నది.* **- మౌలానా సయ్యద్ జలాలుద్దీన్ ఉమ్రి**

విడాకులకు సంబంధించిన ఇస్లామీయ చట్టంపై గల ఆక్షేపణలలో ఒకటి ఇలా ఉంది: "పురుషుడు 'తలాఖ్' అనే పదాన్ని ఉచ్చరిస్తూ తన భార్యను క్షణాలలో ఇంటి నుండి బయటికి పంపివేస్తాడు. ఈ పరిణామం వల్ల స్త్రీ, సమాజంలో ఎలాంటి సహాయకుడు, సంరక్షకుడు లేని స్థితిలో కష్టాలు కడగండ్లను ఎదుర్కొనేందుకు వివశురాలవుతుంది." ఇది చాలా పురాతనమైనది, అలాగే ఎలాంటి పసలేనిది కూడా. కాని కొందరు దీనిని ఇస్లామీయ షరీఅత్ (ధర్మానికి)కు ఒక గొప్ప ఛాలెంజ్‌గా భావిస్తూ మాటిమాటికీ లేవనెత్తుతూ ఉంటారు. అందుకే ఈ ఆక్షేపణలోని డొల్లతనాన్ని ప్రతీకోణం నుండి తేటతెల్లపరచడం జరుగుతుంది. మరి కేవలం ఆక్షేపణ చేయడమే తమ ఉద్దేశంగా ఉన్నవారు, తమ బలహీనతలను ఎన్నటికీ ఒప్పుకోరు. అంతేకాదు, ఏ సమాధానం కూడా వారికి తృప్తినివ్వదు. వారి అసలు కోరిక ఏమిటంటే, "వారు చేస్తున్నటువంటి ఆక్షేపణను స్వీకరించి తదనుగుణంగా షరీఅత్‌లో

(వారి ఉద్దేశ్యంలోగల) "లోటుపాట్లను" దూరం చేస్తూ, దానిని తగు రీతిన సంస్కరించాలని." వీరి అభిప్రాయంలో "ఏ వ్యక్తి అయితే స్త్రీకి విడాకులు ఇస్తాడో అతనికి జీవితాంతం క్రమం తప్పకుండా భరణం చెల్లించే "శిక్ష" తప్పక విధించాలి. ఒకవేళ ఆమెకు రెండవ వివాహం అయినా లేక ఆమె స్వయంగా తన అవసరాలను తీర్చుకునేటప్పుడయినా, ఆమె ఆర్థిక బాధ్యతల నుండి పురుషునికి స్వేచ్ఛ కలిగించవచ్చు." ఇటీవల వెలువడిన సుప్రీం కోర్టు తీర్పు ఇస్లామీయ చట్టంలోని విడాకుల విధానంపై రేకెత్తుతున్న ఆక్షేపణలు ఒక విధంగా వాస్తవమైనవిగానే నిర్ణయించడమయినది. అంతేకాకుండా, "విడాకుల తరువాత కూడా స్త్రీకి భరణం ఆమె జీవితాంతం లేదా రెండవ వివాహం అయ్యేంత వరకు లభించాలి" అనే ప్రతిపాదనకు చట్టపరమైన ప్రమాణం కూడా లభించింది. కాబట్టి ఈ సమస్యను కాస్త విపులంగా పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

1. ఒక వ్యక్తి తన ఆర్థిక భారాన్ని పరాయి వ్యక్తిని మోయమని అడిగితే దానిని ఒక పరిహాసంగా లేక బుద్ధిహీనతగా భావిస్తాము. ఎందుకంటే ఒక వ్యక్తి మరో వ్యక్తికి ఏదైనా బాధ్యతను అప్పగించాలంటే ఇరువురి మధ్య పరియంగానీ, సంబంధం గానీ ఉండాలి. ఇద్దరు పరాయి వ్యక్తుల మధ్య ఇలాంటి ఆధారం ఏదీ ఉండదు. ఇస్లాం ధర్మంలో నికాహ్ (వివాహం) ద్వారా కొన్ని బాధ్యతలు మోపబడతాయి. నికాహ్ తరువాత స్త్రీ దాంపత్య జీవితపు బృహత్తరమైన బాధ్యతలను నెరవేరుస్తూ, కుటుంబ నిర్వహణకుగాను తన సమయాన్నంతటినీ పురుషునికి కేటాయిస్తుంది. అంతేకాదు, తన శక్తి సామర్థ్యాలనూ వెచ్చిస్తుంది. పురుషుడు దానికి బదులుగా ఆమె జీవితావసరాలను సమకూర్చే బాధ్యతను నిర్వర్తిస్తాడు. ఏనాటి వరకయితే ఇరువురూ నికాహ్ బంధంలో ఉంటారో అప్పటి వరకు ఈ బాధ్యత కొనసాగుతుంది. కానీ తలాఖ్

వల్ల భార్యాభర్తల బంధం తెగిపోతుంది. దీనితోపాటు ఈ బాధ్యతలు కూడా అంతమైపోతాయి. ఒకవైపు దాంపత్య జీవితపు బాధ్యతల నుండి స్త్రీకి స్వేచ్ఛ లభిస్తుంది. మరోవైపు పురుషుడు తనపైనున్న ఆర్థిక బాధ్యతల నుండి విముక్తుడవుతాడు. ఇంకా వారిద్దరి మధ్య ఒక విధమైన పరాయితనమూ ఏర్పడుతుంది. ఒకవేళ తలాఖె ముగల్లజా అయినట్లయితే ఈ పరాయితనం ఎంత తీవ్రంగా ఉంటుందంటే; ఎంత సులువుగా స్త్రీ మరొక పురుషునితో, పురుషుడు మరొక స్త్రీతో వివాహ బంధాన్ని ఏర్పరచుకుంటారో అంత సులువుగా మళ్ళీ వీరిద్దరూ యధాపూర్వకంగా తమ నికాహ్ బంధాన్ని కొనసాగించలేరు. వారు ఈ సంబంధాన్ని యధాపూర్వ స్థితికి తీసుకురావాలంటే; స్త్రీ వివాహం వేరొక పురుషునితో జరిగిన తరువాత అతడు తలాఖ్ ఇచ్చినప్పుడు లేదా మరణించినపుడు మాత్రమే ఇది సాధ్యమవుతుంది. ఈ తతంగం జరగనిదే వారు ఎంత కోరుకున్ననూ తమ పూర్వపు జీవితం వైపు మరలలేరు. తలాఖ్ వల్ల ఇంతటి బలీయమైన ఎడబాటు జనించి, పరాయి వారి కంటే అధికమైన పరాయితనం ఏర్పడినచోట్ల వారిలో ఎవరిపై ఎవరికి బాధ్యతలను అంటగట్టాలి, మరి ఎవరు, ఎవరి బాధ్యతలను తమపై వేసుకోవాలి?

2. భార్యాభర్తల మధ్య సాధారణంగా తమ బాధ్యతల విషయంలో ఏమరుపాటుకు గురయినప్పుడు, ఒండొకరి హక్కులను నిర్వర్తించక పోయినప్పుడు తలాఖ్ పరిస్థితి ఆసన్నమవుతుంది. దీనివలన కుటుంబ జీవితంలో సహాయసహకారాలు అందకపోవటం, కష్టసుఖాల్లో పాలుపంచు కోకపోవటం జరుగుతుంది. భార్యాభర్తల్లో వ్యతిరేకత భావమూ మొదలవు తుంది. తలాఖ్ ప్రస్తావన వచ్చినప్పుడు స్త్రీ లోపం ఏమీ ఉండదు, కేవలం పురుషుని క్రౌర్యమే మూలంగా భావించటం జరుగుతోంది. కానీ స్త్రీ కూడా అలాంటి పరిస్థితులకు కారణమై ఉండవచ్చు, దానివల్ల పురుషుడు గత్యంతరం లేక తలాఖ్ ఇచ్చే

ఆస్కారం కూడా ఉంది. దీనిని మనం గుర్తించలేకపోతున్నాము. ఏది ఏమైనప్పటికీ, పురుషుడు మాత్రం భరణాన్ని తన జీవితాంతం తాను తలాఖ్ ఇచ్చిన స్త్రీకి చెల్లించాలని నిర్ణయించటం అన్యాయమే అవుతుంది. ఇందుకు ఎలాంటి నైతికపరమైన, చట్టపరమైన ఆధారమూ లేదు.

3. తలాఖ్ తరువాత స్త్రీ పురుషునితో సహకరించటానికి సుముఖంగా ఉండదు. పురుషుడు కూడా ఆమెకు సంబంధించిన అన్ని బాధ్యతల నుండి విముక్తుడవ్వాలని కోరుకుంటాడు. ఒకవేళ తలాఖ్ తరువాత కూడా స్త్రీ ఆర్థిక బాధ్యతలు అతనిపై యధావిధిగా కొనసాగితే తలాఖ్ ఇవ్వకుండా ఉండటమే అతనికి లాభం కలిగిస్తుంది. తలాఖ్ ఇచ్చి, భార్య ఆర్థిక బాధ్యతలను తీసుకోవటానికి బదులుగా, తలాఖ్ ఇవ్వకుండానే ఆమె నుండి విడిపోవడం, ఆమె హక్కులను క్రియారూపేణా తిరస్కరించటం జరుగుతుంది. కొందరి అభిప్రాయమేమిటంటే, వేరుగానున్న స్త్రీ న్యాయస్థానం నుండి తన హక్కులను పొందగలదు. కానీ ఒకటవది, న్యాయస్థానం నుండి ఏదైనా హక్కును పొందటం అంత సులువైన విషయం కాదు. రెండవది, పురుషుడు వాటి నుండి తప్పించుకోవటానికి ఎన్నో ఉపాయాలను ఆసరాగా చేసుకోగలడు. మూడవదేమిటంటే, తలాఖ్ పొందిన స్త్రీ భరణాన్ని నిర్బంధమైన అంశంగా నిర్ణయించిన తలాఖ్ ఎంతో సంక్లిష్టంగా తయారవుతుంది. అంతేకాదు పురుషుడు భరణం చెల్లించాల్సి వస్తుందని దానికి భయపడి, తలాఖ్ ఇవ్వకుండానే భార్యను నిరాదరణకు గురిచేసి ఆమెను ఇటూఅటూ కాని స్థితిలో వదలివేస్తున్నాడు. ఇదెక్కడి బుద్ధికుశలతో మనం ఆలోచించవలసిన విషయం. ఒక తప్పును సమర్థించుకోవటానికి మరొక తప్పుకు పాల్పడటం బుద్ధిమంతుల లక్షణం కాదు.

4. తలాఖ్ పొందిన తరువాత స్త్రీ పురుషులుభయులకు తమ అభీష్టాను

సారం మరొకరిని తమ జీవితభాగస్వామిగా చేసుకునే స్వాతంత్ర్యం లభిస్తుంది. తద్వారా వారు తమ జీవితంలో తలాఖ్ వల్ల ఏర్పడిన అనిశ్చిత పరిస్థితిని మెరుగుపరచుకుంటారు. కానీ తలాఖ్ ఇచ్చిన పిదప కూడా పురుషుడు భార్య (విడాకులు పొందిన స్త్రీ) ఆర్థిక బాధ్యతలను భరించవలసి వస్తే, అతనికి రెండవ వివాహం చేసుకునే ధైర్యం చాలా అరుదుగా ఉంటుంది. దీనికి కారణం ఏమిటంటే, గత భార్య (విడాకులు పొందిన స్త్రీ), ప్రస్తుత భార్య ఇరువురి పోషణ ఖర్చులను భరించే బదులు, అతడు బహుశా ఒంటరిగా జీవించటానికే ప్రాధాన్యమిస్తాడు. ఈ కారణంగా అతనిలో వ్యక్తిత్వం, గుణగణాలు లోపించి, అతను లైంగిక విశృంఖలత్వానికి గురయ్యే ప్రమాదమూ లేకపోలేదు.

5. ఇదే పద్ధతిలో స్త్రీ కూడా వక్రమార్గాన్ని అనుసరించే అవకాశం లేకపోలేదు. దీనికి కారణం ఏమిటంటే, తలాఖ్ తదనంతరం తన భృతి తనకు క్రమం తప్పకుండా లభిస్తుందనే నమ్మకం స్త్రీకి కలిగినట్లయితే, పురుషుణ్ణి మాటిమాటికి ఇబ్బంది పెట్టడం, మరీ చిన్న చిన్న విషయాలపై కూడా తలాఖ్ పొందాలన్న వైఖరి ఆమెలో తలెత్తుతుంది. ఇదే పాశ్చాత్య దేశాలలో విడాకుల సంఖ్య పెరగటానికి ముఖ్యకారణం అవుతోంది. స్త్రీ తలాఖ్ పొందిన తరువాత కూడా మెయింటెనెన్స్ పేరుతో జీవితాంతం తన భర్త నుండి ఖర్చులు వసూలు చేసుకోవడం, తాను నిశ్చింతగా ఉండవచ్చునన్నది మరో కారణం. ఇస్లాం తలాఖ్ భావనను సరియైనదిగా భావించదు. అంతేకాదు, ఈ భావనను పెంపొందించే పద్ధతులను, నియమనిబంధనలను ఎలాంటి స్థితిలో కూడా బలపరచదు. దాంపత్య జీవితపు ప్రతీ అభ్యంతరాన్ని తలాఖ్ ద్వారా దూరం చేయటాన్ని నిరసిస్తుంది.

6. దీనికి మరో కారణం కూడా ఉంది. తలాఖ్ వల్ల స్త్రీ పురుషులు పరాయివారైపోతారు. కానీ భరణం ఇస్తూ ఉండటం వల్ల ఈ అపరిచిత భావం

సహజంగానే సమసిపోతుంది. పాత గాయాలు నెమ్మదిగా మానిపోతుంటాయి. పరస్పరం కలవటం ఆరంభమవుతుంది. ఇరువైపుల నుండి సానుభూతి, ప్రేమ వ్యక్తమవుతాయి. అంతేకాదు, మొహమాటం పెరుగుతూ పోతుంది. పర్యవసానంగా లైంగిక సంబంధాలు ఏర్పడవచ్చు. ఎందుకంటే మొదటి నుండీ వీరి మధ్య ఎలాంటి నిరోధపు తెర లేనందువల్ల అడ్డు ఉండదు. కాబట్టి ఒక్కొక్కప్పుడు ఈ మొహమాటం, సహవాసం తప్పుడు మార్గం వైపునకు తీసుకుపోతాయి. నీతి నడవడికలు పెడదారి పట్టటానికి అవకాశాన్నిచ్చే స్థితి మిగిలివుండటం ఎంతమాత్రం అభిలషణీయం కాదు.

దీనికి చెప్పబోయే సమాధానం ఏమిటంటే, ఇరువురి మధ్య నేరుగా సంబంధం ఏర్పడకుండా తగిన ఏర్పాటు చేయాలి. అయితే ఇరువురూ ఒకే చోట ఉంటున్నప్పుడు ఇది చాలా కష్టసాధ్యమైనది. అంతేకాకుండా బహుచెడ్డ పరిణామాలు మన దృష్టికి ఎదురవుతాయి. ఏ విధమైన అడ్డూ అదుపు లేకుండా వారిరువురు కలసి ఉంటారు. ఇంకా సమాజం కూడా దానిని సహిస్తుంది. షరీఅత్ (ధర్మశాస్త్రం) శాసిస్తున్నదేమిటంటే, ఏ వ్యక్తికయినా విశృంఖలతను అలవరచుకోవడానికి అనువైన పరిస్థితులను తలెత్తనీయరాదు. కనీసం, ఆ వ్యక్తికి తాను చేస్తున్నది నేరమనే స్పృహ అయినా ఉండాలి.

ఇవి తలాఖ్ పొందిన స్త్రీ భరణాన్ని తప్పనిసరైనదిగా నిర్ణయించటం వల్ల జనించటానికి అవకాశం గల కొన్ని ఆర్థిక, సామాజిక చిక్కులు. ఈ చిక్కులను అలక్ష్యం చేయటం అంత సులువు కాదు.

కొందరు తలాఖ్ అనంతరం స్త్రీ భరణాన్ని ఏదో ఒక విధంగా దివ్య ఖుర్ఆన్ నుండి ధృవపరచేందుకు ప్రయత్నిస్తారు. కానీ ఇది చాలా కష్టసాధ్యమైనది. ఎందుకంటే దివ్యఖుర్ఆన్ వారి ఈ కోరికను మన్నించుటకు ఏ మాత్రం అవకాశం కల్పించదు. తలాఖ్ ఇచ్చిన సందర్భంలో స్త్రీ "మహర్"

(నికాహ్ సందర్భంలో స్త్రీకి పురుషుని నుండి లభించే ధనం), భరణం మరియు ఇద్దత్ (మరో వివాహం కొరకు వేచి ఉండవలసిన గడువు)లకు సంబంధించిన సమస్యలు ఉత్పన్నమవుతాయి. దివ్యఖుర్‌ఆన్, హదీసులలో వీటిని గురించిన ఆదేశాలు ఉన్నాయి. కాని విడాకులు పొందిన స్త్రీకి జీవితాంతం భరణాన్నిచ్చే అంశం ఎక్కడా పేర్కొనబడలేదు; ఇక్కడ వీటిని స్పష్టపరిచేందుకుగాను, వీటికి సంబంధించిన ఆదేశాల వివరణ ఇస్తున్నాము.

వాస్తవంగా తలాఖ్ భార్యాభర్తల కలయిక తరువాత అవుతుంది లేదా భార్యాభర్తల కలయికకు పూర్వమే కావచ్చు. రెండు సందర్భాలలో కూడా 'మహర్' నిర్ణయించటానికి లేక నిర్ణయించబడకపోవటానికి అవకాశం ఉంది. ఈ విధంగా తలాఖ్ నాలుగు విభిన్న స్థితులలో ఇవ్వబడుతుంది. [1] వీటన్నింటి ఆదేశాలు కూడా విభిన్నంగా ఉన్నాయి.

1. భార్యాభర్తల కలయిక తరువాత తలాఖ్ ఇస్తే, మహర్ నిర్ణయించ బడి ఉంటే పూర్తి మహర్ చెల్లించాలి. ఈ విషయం ఇలా తేటతెల్లపరచడ మయింది:

> **"స్త్రీలకు వారి మహర్‌ను సంతోషంగా విధిగా భావిస్తూ చెల్లించండి."** *(నిసా : 4)*

మరోచోట ఇలా సెలవియ్యబడింది:

> **"మీరు వారికి పూర్వం ఇచ్చిన (మహర్) వాటి నుండి దేన్నయినా తిరిగి తీసుకోవటం ధర్మసమ్మతం కాదు."** *(అల్ బఖరా : 229)*

2. భార్యాభర్తల కలయిక తరువాత తలాఖ్ ఇచ్చినట్లయితే మహర్ నిర్ణయించబడని సందర్భంలో మహర్ తప్పనిసరిగా ఇవ్వవలసి ఉంటుంది. ఎందుకంటే స్త్రీ దాంపత్యాన్ని నెరిపిన తరువాత మహర్ ఇవ్వడం విధి అవుతుంది.

**"వారి ద్వారా మీరు అనుభవించిన దాంపత్య సుఖానికి బదులుగా వారి 'మహర్'ను ఒక విధిగా భావించి చెల్లించండి."**

***(నిసా : 24)***

మహర్ పరిమాణం నిర్ణయం కానప్పుడు భార్యాభర్తలు ఇరువురు ఏకాభిప్రాయంతో దానిని నిర్ణయించుకోవాలి. ఒకవేళ వారి మధ్య అభిప్రాయబేధం పొడసూపితే "మహరె మిస్ల్" విధించబడుతుంది. అంటే, ఆ స్త్రీ వంశానికి చెందిన ఇతర మహిళలు ఎంత పరిమాణంలో 'మహర్' తీసుకున్నారో అంతే పరిమాణంలో మహర్ ఆమెకూ వర్తిస్తుంది.[2]

ఇమామ్ రాజీ (రహ్మాలై) ఇలా సెలవిస్తున్నారు: బుద్ధికుశలతలిచ్చే ప్రామాణికం ననుసరించి, ఎవరైనా స్త్రీతో కలయిక జరిపాడనే అనుమానం కలిగినా అతనిపై "మహరె మిస్ల్" విధి అవుతుంది. దీని ఆధారంగానే ఏ మహిళతోనైనా నియమానుసారం నికాహ్ అయిన వెంటనే "మహరె మిస్ల్" విధిగావించబడుతుంది.[3]

3. మహర్ నిర్ణయించబడిన సందర్భంలో భార్యాభర్తల కలయికకు పూర్వమే తలాఖ్ ఇవ్వబడినట్లయితే మహర్‌లో సగభాగం ఇవ్వాలి.

**"మీరు తాకకపూర్వమే మీ స్త్రీలకు విడాకులిస్తే, ఒకవేళ అప్పటికే వారి మహర్ నిర్ణయింపబడి ఉన్నట్లయితే అప్పుడు సగం మహర్‌ను చెల్లించవలసి ఉంటుంది. కాని స్త్రీ గనక ఉదార బుద్ధితో వ్యవహరించి (మహర్‌ను క్షమించి విడిచిపెట్టి)నట్లయితే లేక నికాహ్ బంధం తన చేతిలో ఉన్న పురుషుడు ఔదార్యంతో (పూర్తి**

---

1 & 2. (ఇబ్నె ఆబిదీన్: రద్దుల్ ముహ్తార్ అలద్దుర్రిల్ ముక్తార్, సంపుటం -2; పేజి 463)

3. తఫ్సీరె కబీర్: సంపుటం-2; పేజి 282.

**మహర్) చెల్లించినట్లయితే అది అభ్యంతరకరం కాదు. మీరు (పురుషులు) ఉదార స్వభావంతో వ్యవహరిస్తే, అది భయభక్తులకు సన్నిహితమైనది. పరస్పర వ్యవహారాలలో ఔదార్యం చూపటం మరువకండి. మీరు చేసే పనులను అల్లాహ్ చూస్తున్నాడు.**

***(అల్ బఖర : 237)***

4. మహర్ నిర్ణయించబడని సందర్భంలో భార్యాభర్తల కలయికకు పూర్వమే తలాఖ్ ఇవ్వబడినట్లయితే ఆమెకు 'మతా' (ఏదో కొంత ధనం)ను ఇవ్వాలి. దివ్యఖుర్ఆన్ ఈ సందర్భంలో మహర్ గురించి ప్రస్తావించలేదు.

**"మీరు మీ స్త్రీలను ముట్టుకోకముందే లేక వారి మహర్ (స్త్రీ ధనం) నిర్ణయం కాకపూర్వమే మీరు వారికి విడాకులిస్తే, అది పాపం కాదు. అప్పుడు మీరు వారికి ఏదో కొంత తప్పకుండా ఇవ్వాలి. ధనవంతుడైన వ్యక్తి తన శక్తికొలదీ, పేదవాడైన మనిషి తన స్థితినిబట్టి ధర్మసమ్మతమైన విధంగా చెల్లించాలి. ఇది సజ్జనులైన వారి విధి." *(అల్ బఖర : 236)***

ఈ నాలుగు సందర్భాలతోపాటు మరో సందర్భం కూడా ఉంది. అదేమిటంటే, భార్యాభర్తల కలయికకు పూర్వమే పురుషుడు మరణించి నట్లయితే, ఇంకా 'మహర్' నిర్ణయింపబడనటువంటి సమయంలో ఇమామ్ మాలిక్ (ర.అలై), ఇమామ్ ఔజాయి (ర.అలై) మొదలగు వారి అభిప్రాయం ప్రకారం ఆ స్త్రీకి 'మహర్' లభించదు. కేవలం 'మతా' (ధనం) ఇవ్వటం జరుగుతుంది దీనికి గల ఆధారమేమంటే, భర్త తాను ఏర్పరచుకున్న లైంగిక సంబంధానికి బదులే 'మహర్'. మరి ఈ సంబంధమే ఏర్పడనప్పుడు 'మహర్' ప్రశ్నే తలెత్తదు. కానీ ఆమెకు భర్త ఆస్తిలో వాటా లభిస్తుంది. ఇదే విషయాన్ని ఇమామ్ షాఫయి (ర.అలై) గారు తమ అభిప్రాయంగా వెలిబుచ్చారు.

కాని ఇమామ్ అబూ హనీఫా (ర.అలై), ఇమామ్ అహ్మద్ (ర.అలై) **మొ**దలగు వారి అభిప్రాయమేమంటే, అలాంటి స్త్రీకి 'మహర్ మిస్ల్' లభిస్తుంది. ఇంకా ఆమెకు ఆస్తిలో వాటా కూడా లభిస్తుంది. ఈ విషయాన్నే మహాప్రవక్త ముహమ్మద్ (స) ప్రవచనం బలపరుస్తోంది. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) ముందు ఈ సమస్య ఇలా ప్రశ్నించబడింది: "ఒక వ్యక్తి మరణించాడు, అతడు తన భార్య మహర్‌ను నిర్ణయించనూలేదు, ఆమె సాంగత్యాన్నీ పొందలేదు." దానికి ఆయన (ర) ఇలా సమాధానమిచ్చారు, "ఆమె మహర్, ఆమె వంశానికి చెందిన స్త్రీల మహర్ లాగే లభిస్తుంది. ఆమెకు ఇందులో ఎలాంటి తగ్గింపు ఉండదు. అలాగే హెచ్చింపు కూడా ఉండదు. ఆమె ఇద్దత్‌ను కూడా పూర్తి చేయాలి. ఆమెకు భర్త ఆస్తిలో వాటా కూడా లభిస్తుంది." మాఖిల్ బిన్ సనాన్ అష్జయి (రజి.అ), హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి.అ) గారి ఈ ఫత్వాను బలపరుస్తూ ఇలా సెలవిచ్చారు: "మా తెగకు చెందిన ఒక మహిళ బరూ బిన్తె వర్షజ్ వ్యవహారం ఇలాంటిదే. అపుడు మహాప్రవక్త ముహమ్మద్ (స) కూడా ఇలాంటి తీర్పునే ఇచ్చారు. ఈ దృష్టాంతం విని హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి.అ) వారు చాలా సంతోషించారు.[1]

ఈ హదీసుపై ఆక్షేపణ చేయబడింది. కానీ ఇది నిరాధారం. ఇమామ్ షాఫయీ (ర.అలై) గారి శిష్యులు ఇమామ్ మజ్ని (ర.అలై) ఇలా అన్నారు: ఈ హదీసు ధృవీకరించబడకపోతే దీనికి వ్యతిరేకంగా ఎవరి అభిప్రాయం కూడా స్వీకారయోగ్యం కాదు.[2]

---

1. (తిర్మిజి: నికాహ్ గ్రంథం; బాబ్ మజా ఫిర్రజులి యతజవ్వజుల్ మర్అతి అల్ అఖ్; అబూదావూద్ : నికాహ్ గ్రంథం- బాబ్ మన్ తజవ్వజ వలమ్ యుసమ్మి సదాఖన్ హత్తా మాతా
2. బిదాయతుల్ ముజ్తహిద్ : సంపుటం-2; పేజి -29

ఒకవేళ మహర్ నిర్ణయం కాని సందర్భంలో కలయికకు ముందే స్త్రీ మరణించినప్పుడు కూడా హనఫీ ఫికాహ్‌లో ఇదే ఆదేశం ఉంది.[3]

## ఇద్దత్ మరియు భరణాల సమస్య

భార్యాభర్తల కలయిక తరువాత తలాఖ్ ఇచ్చినట్లయితే ఇద్దత్ మూడు ఋతు క్రమములుగా ఉంటుంది.

**"విడాకులివ్వబడిన స్త్రీలు మూడు ఋతువుల కాలం పూర్తి అయ్యే వరకు విధిగా వేచి ఉండాలి."** ***(అల్ బఖర : 228)***

**"మీ స్త్రీలలో ఎవరైనా ఋతుక్రమం విషయంలో ఆశ వదలుకుంటే వారి విషయంలో మీకేదైనా అనుమానం కలిగితే, అప్పుడు వారి నిర్ణీత గడువు మూడు మాసాలు (అని మీరు తెలుసుకోండి). ఇదే ఆజ్ఞ ఇంకా ఋతుక్రమం ప్రారంభం కాని వారికి కూడ వర్తిస్తుంది. గర్భిణీ స్త్రీల నిర్ణీత గడువు వారి కాన్పు అయ్యేవరకు ఉంటుంది."** ***(తలాఖ్ : 4)***

ఒకవేళ భార్యాభర్తల కలయికకు మునుపే తలాఖ్ ఇవ్వబడితే దానికి ఇద్దత్‌లేదు. దివ్యఖుర్ఆన్‌లో ఇలా సెలవియ్యబడింది.

**"విశ్వాసులైన మానవులారా! మీరు విశ్వాసినులైన స్త్రీలను వివాహం చేసుకుని, తరువాత వారిని ముట్టుకోకమునుపే విడాకులిస్తే, అప్పుడు మీ తరఫు నుండి "ఇద్దత్" ఏదీ వారిపై ఖరారు కాదు; అది పూర్తి అవ్వాలని మీరు కోరలేరు. కనుక వారికి కొంత ధనం ఇచ్చి మంచి పద్ధతిలో సాగనంపండి."** ***(అల్ అహ్‌జాబ్ : 49)***

---

3. రద్దుల్ ముహ్‌తార్ అలద్దురిల్ ముక్తార్ : సంపుటం-2; పేజి 460)

## భరణం మరియు నివాసానికి సంబంధించిన సమస్య

తలాఖ్ రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి, తలాఖే రజయీ. ఇందులో భర్త తన భార్య వైపు మరలే హక్కును కలిగి ఉంటాడు. రెండవది, తలాఖే బాయిన్. ఇందులో భర్త తన భార్య వైపు మరలే హక్కును కోల్పోతాడు. వీటి సంక్షిప్త ఆదేశాలు ఇలా ఉన్నాయి.

1. తలాఖె రజయీ ఇవ్వబడినపుడు స్త్రీకి భరణం మరియు నివాసం రెండూ లభిస్తాయని ఫికహ్ (ధార్మికవేత్త)ల మధ్య ఏకాభిప్రాయం ఉంది.

2. ఒకవేళ స్త్రీ గర్భవతి అయినప్పుడు అది తలాఖె రజయీ లేక తలాఖె బాయిన్ అయినప్పటికీ భరణం మరియు నివాసం రెండూ వాజిబ్ (తప్పని సరిగా ఇవ్వాలి). ఈ విషయంలోనూ ఫుకహాల మధ్య ఏకాభిప్రాయం ఉంది. దివ్యఖుర్ఆన్ ఇలా సెలవిస్తోంది.

**ఒకవేళ వారు గర్భవతులైతే, వారు ప్రసవించే వరకు వారి కోసం ఖర్చు చేస్తూ ఉండండి. *(అత్ తలాఖ్ : 6)***

3. ఇమామ్ అహ్మద్ (ర.అలై), దావూద్ జాహిరీ (ర.అలై) మరియు అబూ సూర్ (ర.అలై) మొదలగు వారి అభిప్రాయం ప్రకారం, స్త్రీ గర్భం ధరించి నపుడు తలాఖె బాయిన్ ఇచ్చినట్లయితే భర్తపై ఆమె భరణం వాజిబ్ కాదు. ఈ విషయంలో వీరి వద్ద ఒక ఆధారం ఉంది. అది ఏమంటే, హజ్రత్ ఫాతిమ బిన్తె ఖైస్ యొక్క కథనం ప్రకారం, "నా భర్త నాకు తలాఖె బాయిన్ ఇచ్చారు. అప్పుడు నేను మహాప్రవక్త (స)ను సంప్రదించగా ఆయన (స) ఇలా సమా ధానం ఇచ్చారు, "లైస లకి అలైహి నఫ్ఖతన్" (నీ భర్తపై నీ భరణం వాజిబ్ కాదు).[1] మరో కథనపు పదాలు ఇలా ఉన్నాయి. "లా నఫ్ఖతల్లకి వలా సుక్నా".[2]

---

1. *ముస్లిం : కితాబుత్తలాఖ్ బాబుల్ ముతల్లఖతుల్ బాయిన్ : లా నఫ్ఖత లహా.*
2. *నీకు భరణం లభిందు, నివాసం కూడా లభించదు. (మొదట పేర్కొన్న ఆధారమే).*

ఇమామ్ మాలిక్ (ర.అలై). ఇమామ్ షాఫయీ (ర.అలై) మొదలైన వారు చెప్పిందేమిటంటే, దివ్యఖుర్‌ఆన్‌లో ఈ సందర్భానికనుగుణంగా నివాసం గురించిన ప్రస్తావన ఉంది. (తలాఖ్ : 6) కాబట్టి ఆమెకు నివాసం మాత్రం లభిస్తుంది కాని భరణం లభించదు.

ఇబ్నె రుష్ద్ (ర.అలై), మాలికీ అనుసరణీయులు వారు అయి నప్పటికీ పై విషయాన్ని ఒక బలహీనమైన అభిప్రాయంగా నిర్ణయిస్తున్నారు.[1]

ఈ విషయంలో హనఫీ సాంప్రదాయం అధిక శక్తిమంతంగా ఉన్నట్లు తెలుస్తోంది.

4. హనఫీ ఉలమాలు (ధార్మికవేత్తలు), మరికొందు ఇతర ఉలమాల అభిప్రాయాన్ననుసరించి తలాఖె రజయీ అయినా లేక తలాఖె బాయిన్ అయినా స్త్రీకి, భరణం మరియు నివాసం రెండూ లభిస్తాయి. హనఫీలకు ఉన్న ఆధారమేమంటే, తలాఖ్ పొందిన స్త్రీకి నివాసం గురించి దివ్యఖుర్‌ఆన్‌లో చాలా స్పష్టంగా పేర్కొనబడింది. కనుక భరణం దాని వెంబడే ఉంటుంది. తలాఖ్ తరువాత స్త్రీని ఇద్దత్ కాలం వరకు ఇంటిలోనే ఉంచాలని, ఆమె ఖర్చులను కూడా భర్త భరించాలనే కట్టుబాటును దివ్యఖుర్‌ఆన్ పురుషులపై విధించింది. దీని మూలంగానే భార్య భరణం భర్తలపై విధిగా చేయబడింది. దివ్యగ్రంథం సూక్తులు దీనినే బలపరుస్తున్నాయి.

> **వారిని (నిర్ణీత గడువు కాలంలో) మీరు నివసించే చోటనే ఉంచండి, మీకు ఎలాంటి చోటు లభించినా సరే. వారిని ఇబ్బందులపాలు చేయటానికి వేధించకండి. *(తలాఖ్ : 6)***

జసాస్ (ర.లై) ఇలా చెబుతున్నారు: పై వాక్యాలు సర్వసాధారణమైనవి. ఇవి తలాఖె బాయిన్ పొందిన స్త్రీ మరియు తలాఖె రజయీ పొందిన స్త్రీ

1. బిదాయతుల్ ముజ్‌తహిద్ : సంపుటం -2; పుట-103.

ఇరువురికీ సంబంధించినవి. "మిన్ వుజిద్‌కుమ్" (మీ వెసులుబాటు మరియు శక్తి కొలది).[1]

పై పదాలు తెలిపేదేమిటంటే, భర్త ధనంలో తలాఖ్ పొందిన స్త్రీ నివాసం వాజిబ్ చేయడమైంది. ఈ అంశం విశదపరిచేదేమంటే, ధనంలో భరణం కూడా వాజిబ్ అవుతుంది.

ఎందుకంటే నివాసం భరణంలో ఒక భాగమే. ఇక రెండవ విషయం, "వారిని ఇబ్బందులపాలు చేయుటకుగాను వేధించకండి." ఇబ్బందికి గురి చేయుట మరియు వేధించుట ఇవి రెండూ ఎలా అయితే నివాసానికి వర్తిస్తాయో, భరణానికి కూడా అలానే వర్తిస్తాయి.[2]

ఫాతిమా బిన్తె ఖైస్ కథనాన్ని హజ్రత్ ఉమర్ (రజి) గారు అంగీకరించలేదు. ఆయన ఇలా సెలవిచ్చారు:

"మేము అల్లాహ్ గ్రంథాన్ని మరియు ప్రవక్త (స) సంప్రదాయాన్ని కేవలం ఒక స్త్రీ వాంగ్మూలంపై విడనాడలేము. మనకు తెలియదు, ఆమె ఆ దృష్టాంతాన్ని సరిగా గుర్తుంచుకున్నదో లేమ మరచినదో. తలాఖ్ పొందిన స్త్రీకి నివాసంతోపాటు భరణం కూడా ఉంది."[3]

దీని అర్థమేమంటే హజ్రత్ ఉమర్ (రజి) అభిప్రాయం, దైవగ్రంథం మరియు దైవ ప్రవక్త (స) సంప్రదాయానుసారం తలాఖ్ పొందిన స్త్రీకి భరణం, నివాసం రెండూ సరియైనవే.[4]

---

1. *జమకర్షి : అల్ వజద్, అల్ వస్ఆ వత్తాఖత, అల్ కష్షాఫ్ 2 సంపుటం, పేజి. 1479*
2. *జస్సాస్ : అహ్కాముల్ ఖుర్ఆన్ సంపుటం -3; పుట-565)*
3. ముస్లిం: కితాబుత్తలాఖ్ బాబుల్ ముతలఖతుల్ బాయిన్ లా నఫ్ఖత లహా)
4. ఈ సమస్యను విపులంగా చర్చించేందుకుగాను చదవండి : బిదాయతుల్ ముజ్‌తహిద్. సంపుటం -2; పుట -102; జస్సాస్ :అహ్కాముల్ ఖుర్ఆన్ సంపుటం-3, పేజీలు 564-570;ఇబ్నె ఖుదామ : అల్ ముగ్ని సంపుటం-7; పేజీలు-606-610)

పై విషయాల వల్ల స్పష్టంగా తెలిసిందేమంటే, తలాఖ్ పొందిన స్త్రీ భరణం, నివాసం భర్తపై 'ఇద్దత్' వరకు వాజిబ్ అవుతుంది. కానీ 'ఇద్దత్' ముగిసిన పిదప భరణం, నివాసం రెండింటి కోసం స్త్రీ దావా చేయలేదు.

దివ్యఖుర్ఆన్ మార్గనిర్దేశనంలో తలాఖ్ పొందిన స్త్రీ భరణాన్ని ధృవీకరించాలని కోరుకుంటున్న వారు అల్ బఖరా సూరాలోని 241వ ఆయత్‌ను ఆధారంగా చేసుకుని వాదిస్తారు. ఆ ఆయత్ ఇలా ఉంది:

**"ఇదే విధంగా విడాకులివ్వబడిన స్త్రీలకు కూడా సముచిత రీతిన ఎంతో కొంత ఇచ్చి సాగనంపాలి. భయభక్తులు గలవారు దీనిని విధిగా పాటించాలి."**

ఈ వాక్యంలో "తలాఖ్ పొందిన స్త్రీకి మహర్‌తోపాటు 'మతా' (ధనం) ఇవ్వాలనే "ఆదేశం ఇవ్వబడింది. అంతే కాకుండా, ఇందులో ధనం గురించి ఎలాంటి నిర్ణయమూ జరగలేదు. దీనిని అప్పటి సంప్రదాయాలు, నియమాల కనుగుణంగా వదలివేయడమైంది. కనుక దీనికి అర్థం ఏమిటంటే, ఈ విషయాన్ని అప్పటి పరిస్థితులకనుగుణంగా నిర్ణయించుకోవచ్చు. వీరి అభిప్రాయంలో దీనిని జీవితాంతం లభించే భరణం రూపంలో నిర్ణయించినప్పటికీ అది దివ్యఖుర్ఆన్ ఆదేశాలను శిరసావహించినట్లవుతుంది. విరుద్ధం ఎంతమాత్రం కాదు.

తలాఖ్ పొందిన స్త్రీ కోసం పై వాక్యంలో పేర్కొన్నటువంటి 'మతా' లేక ధనం గురించి క్షుణ్ణంగా తెలుసుకోవటానికి ఈ క్రింది ప్రశ్నలను పరిశీలించుకోవాలి.

1. 'మతా' (ధనం) అంటే ఏమిటి?

2. దీని స్థానం నైతికపరమైనదా లేక చట్టపరమైనదా?

3. ఒకవేళ ఇది చట్టపరమైనదైతే అన్ని రకాల తలాఖ్ పొందిన స్త్రీలకు వర్తిస్తుందా లేక కొన్ని రకాల తలాక్ పొందిన స్త్రీలకే వర్తిస్తుందా?

1. మతా అంటే తలాఖ్ పొందిన స్త్రీకి జీవితాంతం లేక ఆమె పునర్వివాహం చేసుకునే వరకు, భర్త ఆమెకు ధన సహాయం చేస్తూ ఉండాలని కొందరు వ్యక్తులు భావిస్తున్నారు. ఇంకా ఇదే అర్థాన్ని ఇతరులు కూడా స్ఫురింపజేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ జీవితాంత సహాయాన్ని ఒకే తడవలోనైనా చేయవచ్చు లేదా వాయిదా పద్ధతుల్లోనైనా చెల్లించవచ్చు. ఏది ఏమయినా ఇది తప్పనిసరి అంశంగా ఉండాలి. 'మతా' పదానికి ఇలాంటి అర్థాన్ని దివ్యఖుర్ఆన్ ఆయతులలోని సందర్భాల్లో కానీ, నిఘంటువును వినియోగించడం వల్ల కానీ ధృవీకరించలేము. అంతేకాదు సహాబా ప్రవక్త సహచరులు (రజి), తాబయీన్ (సహాబాల అనుచరులు) మరియు ఫుకహా (ఇస్లాం ధార్మికవేత్తలు) సయితం దీనికి ఇలాంటి అర్థాన్ని తీసుకోలేదు.

ఈ చర్చలో 'మతా' అనే పదాన్ని దివ్యఖుర్ఆన్ ఏ సందర్భంలో పేర్కొన్నదో గమనించినట్లయితే దాని అర్థం స్వతహాగానే అవగతమవుతుంది. భార్యాభర్తల కలయికకు పూర్వమే ఏ స్త్రీకయితే తలాఖ్ ఇస్తారో, ఆమె మహర్ నిర్ణయింపబడినట్లయితే అందులో సగభాగం పొందేందుకు ఆమెకు హక్కు ఉంది. ఒకవేళ మహర్ నిర్ణయం కానప్పుడు 'మతా' ఇవ్వడం జరుగుతుందని దివ్యఖుర్ఆన్‌లో పేర్కొనబడింది. 'మహర్' భావనలో జీవితాంతం లభించే భరణం లేనప్పుడు, 'మతా'లో ఈ భావన ఎలా వస్తుంది? తలాఖ్ పొందిన స్త్రీకి జీవితాంతం భరణం అందజేయడానికి?

నిఘంటువులో కొద్దిపాటి వస్తుసామగ్రికి, కొన్ని సందర్భాలలో మాత్రమే ప్రయోజనం కలిగించే వస్తువులను 'మతా' గా చెప్పబడింది.[1]

---

1. లిసానుల్ అరబ్ మాద్ద 'మతఆ'

ఇమామ్ రాజి (ర.అలై) ఇలా సెలవిస్తున్నారు:

"అసలుల్ ముత్అహ్ వల్ మతాఅ మా యంతఫివు బిహి ఇన్తిఫాఅన్ గైర బాఖిన్ బల్ మున్ఖజియన్ అన్ ఖరీబ్"[2]

"ఏ వస్తువు ద్వారానయితే ప్రయోజనం పొందిన పిదప అది కనుమరుగవుతుందో, అంటే, అది పూర్తిగా అంతమైపోతుంది. అలాంటిది ముతఅ లేక మతా."

ఇప్పుడు మనం ఈ విషయం గురించి సహాబా (రజి), తాబయీ (ర.అలై) ల అభిప్రాయలను ఇంకా వారు ప్రవర్తించిన తీరును పరిశీలిద్దాం.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి.అ) ఇలా సెలవిస్తున్నారు; తలాఖ్ పొందిన స్త్రీ 'మతా' గరిష్ఠ పరిమాణం ఏమంటే ఆమెకు ఒక సేవకుణ్ణి ఇవ్వడం. కనిష్ట పరిమాణం ఏమంటే ఒక జత బట్టలివ్వడం (వాటిలో మూడు వస్త్రాలు ఉండాలి). చివరిగా ఇచ్చే వస్తువేమంటే కొద్దిగా వెండి (ధనం). హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ఇలా తెలిపారు; దాని పరిమాణం కనీసం ముప్పయి దిర్హములై ఉండాలి.

తాబయీలలో ఖాజి షరీహ్ (ర.అలై) 'మతా'ను అయిదే వేల దిర్హములుగా తెలిపారు. ఇమామ్ షాఫయీ (ర.అలై) ఇంటిలో ఉన్న అన్ని వస్త్రములు, కంబళ్ళు, దుప్పట్లు అని పేర్కొన్నారు. హజ్రత్ హసన్ బస్రీ (ర.అలై) ప్రకారం, మతా పరిమాణం ఏమీ నిర్ణయింపబడలేదు. వ్యక్తి తన స్తోమతను బట్టి ఇస్తాడు. అతా బిన్ అబీ రబాహ్ (ర.అలై) కూడా ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

తలాఖ్ పొందిన స్త్రీకి సహృదయంతో అత్యధికంగా సహాయం చేసిన దృష్టాంతాలు కూడా చాలా ఉన్నాయి. హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి)

2. రాజి: తఫ్సీరె కబీర్ : సంపుటం-2; పుట 284

తమ భార్య తమాజర్‌కు తలాక్ ఇచ్చారు. అప్పుడామెకు 'మతా'గా ఒక నీగ్రో బానిస స్త్రీని ఇచ్చారు.

హజ్రత్ హసన్ (రజి) తన భార్యకు తలాఖ్ ఇచ్చిన తరువాత 'మతా' రూపేణ పదివేల దిర్హములు ఇచ్చారు.[1]

ఇలాంటి ఉదాహరణలు ఎన్నో వున్నాయి. వీటి స్థాయి కేవలం పురుషుని సత్ప్రవర్తన, ఒక రకంగా ఉపకారం లాంటివే. వీటిని చట్టబద్ధ నియమాలుగా రూపుదిద్దలేము.

ధార్మికవేత్తలు ఆయా కాలాల పరిస్థితులను బట్టి దీని పరిమాణాన్ని నిర్ణయించటానికి కృషి చేశారు. హనఫీ ఫికహ్‌లో తలాఖ్ పొందిన స్త్రీ 'మతా' ఇలా ఉంది. ఒక జత వస్త్రాలు ఇవ్వాలి. అందులో ఎన్ని వస్త్రాలు ఉండాలి అనే విషయంలో సామాజిక నిబంధన సంప్రదాయాలను అనుసరించి ఉంటుంది. వస్తువు నాణ్యత గురించి ఒక అభిప్రాయమేమంటే, అది భర్త స్థాయిని బట్టి ఉండాలి. రెండవ అభిప్రాయమేమంటే, ఇక్కడ భర్త, భార్య ఇరువురి సామాజిక స్థాయిని పరిగణనలోకి తీసుకోవటం జరుగుతుంది. దీనితోపాటు 'మతా' పరిమాణం 'మహరెమిస్ల్' సగభాగానికంటే మించరాదనే విషయంలో హనఫీ ధార్మికవేత్తల మధ్య ఏకాభిప్రాయం ఉంది. కాబట్టి 'మతా' పరిమాణాన్ని దాని స్థానంలోనే ఉంచడమైనది. ఇంకా 'మతా' అయిదు దిర్హముల కంటే తక్కువగా ఉండకూడదు.[2]

---

1. పై విషయాల వివరణ కొరకు చూడండి: ఇబ్నె జరీర్ సంపుటం-2; పుట, 304-305, ఇబ్నె కసీర్ సంపుటం-1; పుట-288, అల్ ముహల్లా : సంపుటం -10; పుట-248.

2. రద్దుల్ ముహ్‌తార్ అలద్దుర్రిల్ ముక్తార్: సంపుటం-2; పుట-462) (కావున హనఫీ విధానాన్ననుసరించి మహర్ పరిమాణం కనీసం పది దిర్హములు

మాలికీ ఫికహ్‌లో ఇలా తెలుపబడింది: ఒక వ్యక్తి తన భార్యకు తలాఖ్ ఇచ్చిన తరువాత ఆ వ్యక్తి తన ఆర్థిక స్థాయిని బట్టి 'మహర్'తో పాటు ఏమి ఇచ్చినా అది 'మతా' గానే ఎంచబడుతుంది. [1]

ఇమామ్ షాఫయీ (ర.అలై) 'మతా'ను ఈ విధంగా నిర్ణయించారు: స్థితిపరుడైన వ్యక్తి విషయంలోనయితే ఒక సేవకుడు, సామాన్య వ్యక్తి విషయంలో ఒక జత వస్త్రములు. 'మతా' కనీస స్థాయి ఏమంటే, ముప్పయి దిర్హములు లేక అంతే విలువగల ఏదైనా వస్తువు ఇవ్వాలి. దీనితోపాటు ఈ పరిమాణంలో హెచ్చుతగ్గులను సరిపెట్టుకునే హక్కు భార్యాభర్తలిరువురికీ ఇవ్వబడింది. [2]

ఇంచుమించుగా ఇదే విషయాన్ని హంబలీ ఫికహ్‌లోనూ పేర్కొనడ మైంది. 'మతా' పురుషుని స్థోమతనుబట్టే ఉండాలి. దీని గరిష్ఠ పరిమాణం ఏమంటే, ఒక సేవకుణ్ణి ఇవ్వాలి. కనిష్ఠ పరిమాణం ఏమంటే, ఒక జత వస్త్రాలు ఇవ్వాలి. వాటిలో ఎన్ని వస్త్రాలు ఉండాలంటే, వాటిని ధరించి నమాజు చేయుటకు వీలుగా ఉండాలి. భర్త వీటికంటే అధికంగానయినా ఇవ్వవచ్చు, భార్య వీటికంటే తక్కువగానయినా పొందవచ్చు. [3]

ధార్మికవేత్తలు తమ కలాలకనుగుణంగా 'మతా'ను నిర్ణయించేందుకు ప్రయత్నించారు. ప్రతి కాలంలో ఆనాటి పరిస్థితులకు అనుగుణంగా ఇందులో హెచ్చుతగ్గులు చేయవచ్చును.

---

ఉండాలి. ఒకవేళ 'మతా'ను 'మహరె మిస్ల్' సగభాగంగా భావించినట్లయితే అది ఒక జత వస్త్రాల కంటే ఎక్కువగా కూడా కావచ్చు.

1. అష్షర్హుస్సగీర్ : సంపుటం-2; పుట-616
2. బగ్వీ: ముఆలిముత్తన్‌జీల్ . సంపుటం-1; పుట-203; ఖతీబ్ షర్‌బీని: అస్సిరాజుల్ మునీర్: సంపుటం-1; పుట-153.
3. ఇబ్నె ఖుదామ : అల్ ముగ్ని; సంపుటం-2; పుట-716

ఈ చర్చలతో ప్రస్ఫుటమవుతున్న విషయం ఏమంటే, వాస్తవానికి తలాఖ్ ఇచ్చిన సందర్భంలో, స్త్రీ హృదయానికి సాంత్వన చేకూర్చే ఉద్దేశ్యంతో ఇవ్వబడే వస్తు సామగ్రిని 'మతా' అంటారు. కాని దీనికి విపరీతార్థమిచ్చి జీవితాంత భరణంగా మార్చివేయటం, ఈ పదానికున్న అర్థంపై ప్రత్యక్ష బలాత్కారమే అవుతుంది. అంతేకాదు, ఇలాంటి ప్రవృత్తి ఒక గౌరవనీయుడైన వ్యక్తి నుండి ఏ మాత్రం ఆశించలేము.

2. ఇక 'మతా' స్థానం నైతికపరమైనదా లేక చట్టపరమైనదా? అనే విషయాన్ని పరిశీలిద్దాం:

ఈ సమస్య గురించి ఇమామ్ మాలిక్ (ర.అలై) దృక్కోణం ఇలా ఉంది: ఏ స్త్రీకయితే తలాఖ్ ఇవ్వబడిందో ఆమెకు 'మతా' ఇవ్వడం అభిలషణీయమైనదే కానీ విధికాదు. దివ్యఖుర్ఆన్‌లోని ఆయత్ చివరన పేర్కొనబడిన "హక్కున్ అలల్ ముత్తఖీన్" అనే పదాలకి ఆధారంగా ఈయన ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇంతకు ముందు ఆయత్ సంఖ్య 236లో 'మతా'ను "హక్కున్ అల్ ముహ్‌సినీన్", (సజ్జనులైన వారి విధిగా) చెప్పబడింది. ఏ విషయమయితే దైవభీతికి, సత్కార్యానికి తార్కాణంగా ఎంచబడుతుందో దానిని మనం అందరిపై విధిగా నిర్ణయించలేము.[1]

తాబయీలలో ఖాజీ షరీహ్ (ర.అలై) అభిప్రాయం కూడా ఇలాగే ఉంది. ఒక కథనం ప్రకారం, ఒక వ్యక్తి తన భార్యకు తలాఖ్ ఇచ్చాడు. అంతకు పూర్వమే ఆమె సాంగత్యాన్నీ పొందాడు. ఆమె ఖాజీ షరీహ్ (ర.అలై) న్యాయ స్థానం (ఖాజీ కోర్టు)లో దావా వేసింది. అప్పుడాయన ఆమె భర్తనుద్దేశించి 'ముహసినీన్' (సజ్జను)ల వర్గములో చేరటానికి, 'ముత్తఖీ' (దైవ ధర్మ

1. అహ్మదుద్దర్‌దీర్ : అష్షర్హుస్సగీర్ సంపుటం-2; పుట - 217-218)

పరాయణు)ల వర్గములో చేరటానికి విముఖత చూపరాదని చెప్పారు. అతడిని 'మతా' చెల్లించాలని బలవంతపెట్టలేదు.[2]

ఇమామ్ మాలిక్ (ర.అలై) అభిప్రాయం ప్రకారం, ఏ స్త్రీ అయితే ఏకాంతాన్ని గడపక పూర్వమే తలాఖ్‌ను పొందినట్లయితే ఆమెకు నిర్ణయించబడిన 'మహర్'లో సగభాగం లభిస్తుంది. 'మతా' లభించదు.[3]

3. ఇమామ్ మాలిక్ (ర.అలై) మినహా, ఇతర ధార్మికవేత్తలందరూ 'మతా'ను వాజిబ్ (ఇవ్వవలసినది)గా నిర్ణయించారు. తలాఖ్ పొందిన స్త్రీకి 'మతా' చెల్లించటం 'వాజిబ్' అవుతుందా లేక వారిలో కొందరికి వ్వటం 'వాజిబ్', మరి కొందరికి 'వాజిబ్' కాదా? అనే విషయంలో వారి మధ్య బేధాభిప్రాయం ఉంది.

ఈ విషయంలో హనీఫీ ఫికహ్ అభిప్రాయమేమంటే 'మహర్' నిర్ణయించబడకుండా, కలయిక కూడా జరగని, తలాఖ్ పొందిన స్త్రీల విషయంలో మాత్రమే 'మతా' వాజిబ్ అవుతుంది. ఎందుకంటే వీరికి మాత్రమే 'మతా' ఇవ్వాలని దివ్యగ్రంథం అల్ బఖర : 236లో ఆదేశిస్తోంది.

తలాఖ్ పొందిన ఇతర స్త్రీలకు 'మహర్', 'భరణం' రెండూ లభిస్తాయి. అందువల్ల వారికి 'మతా' చెల్లించటం 'వాజిబ్' కాదు. ఒకవేళ ఇలాంటి వారికి కూడా 'మతా' చెల్లించినట్లయితే అది ఉన్నతమైనది, అభిలషణీయమైనది.[4]

ఇమామ్ అహ్మద్ (ర.అలై) అభిప్రాయం కూడా ఇదే.[5]

---

2. బగ్వీ : ముఆలిము త్తన్‌జీల్ అలా హామిషిల్ ఖాజిన్ : సంపుటం-1; పుట-204)
3. (అష్షర్హు స్సగీర్ : సంపుటం-2; పుట-617)
4. రద్దుల్ ముహ్‌తార్ అలద్దుర్రిల్ ముక్తార్: సంపుటం-2.
5. మరిన్ని వివరాలకు చూడండి: ఇబ్నె ఖుదామ : అల్ ముగ్ని, సంపుటం-2; పుట-715.

ఇమామ్ షాఫయీ (ర.అలై) ఇలా సెలవిస్తున్నారు; అన్ని రకాలుగా తలాఖ్ పొందిన స్త్రీలకు 'మతా' ఇవ్వాలి. వీరిలో 'మహర్' నిర్ణయించబడి, కలయిక జరగక పూర్వమే తలాఖ్ పొందిన స్త్రీకి మినహాయింపు ఉంది. వీరికి 'మహర్'లో సగభాగం లభిస్తుందని దివ్యఖుర్ఆన్ స్పష్టం చేసింది.[6]

దీనినే సహాబాలు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి.అ) గారి అభిప్రాయమని చెప్పుకుంటారు.[7]

హజ్రత్ సయీద్ బిన్ జుబేర్ (ర.అలై) హజ్రత్ అబుల్ ఆలియ (ర.అలై), హజ్రత్ హసన్ బస్రీ (ర.అలై) మొదలుగు వారి అభిప్రాయంలో తలాఖ్ పొందిన స్త్రీకి 'మతా' ఇవ్వడం 'వాజిబ్'.[8]

ఇదే అభిప్రాయం హజ్రత్ అలీ (రజి.అ), ఇమామ్ జుహ్రీ (ర.అలై), ఇబ్రాహీమ్ నఖ్యీ (ర.అలై), అతా బిన్ అబీ రబాహ్ (ర.అలై) మరియు సుఫియాన్ సూరి (ర.అలై)ల నుండి సేకరించబడింది.[9]

ఎవరయితే తలాఖ్ పొందిన స్త్రీకి 'మతా' తప్పనిసరి అయినదిగా నిర్ణయిం చాలని కోరుతున్నారో బహుశా వారు ఈ అభిప్రాయానికి, ఇతర అభిప్రాయాలపై ప్రాధాన్యతను ఆపాదిస్తారు. కానీ ఇందులో ఒకటి రెండు నష్టాలు చాలా స్పష్టంగా కానవస్తున్నాయి. మొదటిదేమంటే, ఏ స్త్రీకయితే కలయికకు పూర్వమే తలాఖ్ ఇచ్చిన సందర్భంలో, ఆమె 'మహర్' నిర్ణయిం పబడి ఉన్నట్లయితే ఆమెకు 'మహర్', 'మతా' రెండూ లభిస్తాయి. 'మహర్' నిర్ణయింపబడిన సందర్భంలో ఆమెకు కేవలం 'మతా' మాత్రమే లభిస్తుంది. ఇది ఒక విధంగా అన్యాయంగా కానవస్తుంది.

---

6. బిదాయతుల్ ముజ్తహిద్ : సంపుటం-2; పుటలు-105, -06.
7. బగ్వి: ముఆలిముత్తన్జీల్ అలా హామిషిల్ ఖాజిన్. సంపుటం-1; పుట-204)
8. ఇబ్నె కసీర్ : సంపుటం-1; పుట-208
9. ఇబ్నె హజ్మ్ : **అల్ ముహల్లా, సంపుటం-10;** పుట-247

రెండవ విషయమేమంటే; తలాఖ్ పొందినటువంటి ప్రతీ స్త్రీ విషయంలో 'మతా' వాజిబ్‌గా నిర్ణయింపబడినప్పుడు మనకు తెలిసేదేమంటే, 'మహర్', భరణం మాదిరిగానే 'మతా' కూడా ఆమెకు తప్పనిసరైన హక్కు అవుతుంది. కాబట్టి ఆమె చట్టపరంగా దీని కొరకు డిమాండు చేయడానికీ అవకాశం ఉంది.

తలాఖ్ పొందిన స్త్రీ 'మతా' కొరకు డిమాండు చేయడానికి చట్టపరమైన హక్కును కలిగి ఉందని కొందరు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారనటంలో ఎలాంటి సందేహంలేదు. కానీ ఇది ఒక బలహీనమైన అభిప్రాయం. ఎందుకంటే ఇస్లామీయ న్యాయస్థానాలు ఏనాడూ ఇలాంటి తీర్పును ఇవ్వలేదు. ఇమామ్ సాబి (ర.అలై) ఇలా అంటున్నారు :

"దైవం సాక్షిగా, 'మతా' చెల్లించలేదనే అభియోగంపై ఎవ్వరినీ ఖైదు చేసినట్లు నేను చూడలేదు. దైవంసాక్షిగా, ఒకవేళ అది వాజిబ్ అయినట్లయితే దానిని చెల్లించని సందర్భంలో గౌరవనీయ ఖాజీలు కారాగార శిక్ష తప్పక విధించేవారు."[1]

ఇప్పటి వరకు మేము 'మతా' అర్థం, దాని భావ ఉద్దేశాన్ని, చట్టపరంగా దానికి ఉన్న స్థానం గురించి సవివరంగా చర్చించాము. ఇదే కాకుండా వివిధ ధార్మికవేత్తల అభిప్రాయాలను కూడా పొందుపరిచాము. వీటి వల్ల మనకు తేటతెల్లమవుతున్న విషయం ఏమింటే, ఖుర్ఆన్, హదీసుల ఆదేశానుసారం తలాఖ్ ఇచ్చిన తరువాత కూడా పురుషునిపై స్త్రీకి ఉన్నటువంటి ఆర్థికపరమైన బాధ్యతలు అలాగే కొనసాగుతాయని నిరూపించలేము. అంతేకాకుండా మన పూర్వీకుల నుండి నేటి తరం వరకు ఈ అభిప్రాయాన్ని ఎవరూ వెలిబుచ్చలేదు. ఇది ఎంత నిరాధారమైన భావంతో కూడినదంటే దీనికి ఏ కోణంలోనూ బలం చేకూరదు.

---

1. తఫ్సీర్ ఇబ్నె కసీర్ : సంపుటం–1; పుట–297.

## చివరిగా ఈ ప్రశ్నను పరిశీలిద్దాం

తలాఖ్ అనంతరం స్త్రీ ఎక్కడికి వెళ్ళాలి? ఆమె ఆర్థిక భారాన్ని ఎవరు భరించాలి? ఈ ప్రశ్నకు బదులిచ్చే యత్నంలో వివిధ రకాల ప్రతిపాదనలు చేయబడుతున్నాయి. ఇందులో భాగంగానే దివ్యఖుర్‌ఆన్‌ను కూలంకషంగా పఠించి దాని ఆదేశానుసారం కొత్త కొత్త విషయాలను వెలికితీసే కృషి సల్పడం జరుగుతోంది.

ఈ పరంపరలో ఒక ప్రాథమిక విషయం మన దృష్టిలో ఉండాలి. అదేమంటే, ఇస్లామీయ చట్టం ప్రకారం, మహిళ ఎప్పుడూ తన ఆర్థిక అవసరాలను పరిపూర్ణం చేసుకోవటానికి వివశురాలు కాదు.[2] ఫికహ్‌లో ఇలా పేర్కొనబడింది: "ముజర్రిదున్నొసతు అజజ్" (స్త్రీ కావడం ఆమె అశక్తత),[3] అంటే ఆమెకు తన ఆర్థిక బాధ్యతను మోసేంతటి శక్తి ఉండదు. ఈ కారణం వల్లనే ఇతరులపై ఆమె బాధ్యత మోపబడుతుంది. భర్త ఎలాంటి పరిస్థితిలో నయినా ఆమె ఆర్థిక బాధ్యతలను భరించాలి. ఒకవేళ అతను స్వయంగా సంపాదనాపరుడు కానపుడు, తల్లిదండ్రులు లేక ఆమె సంతానంపై ఈ బాధ్యత మోపటం జరుగుతుంది.

తలాఖ్ తరువాత స్త్రీ మూడు స్థితులలో ఏదో ఒకదానిలో ఉండవలసి ఉంటుంది.

1. ఆమె రెండవ వివాహం చేసుకోవటం; ఈ సందర్భంలో ఆమె ఆర్థిక బాధ్యతలు రెండవ భర్తపై 'వాజిబ్' అవుతాయి.

2. ఆమె సంతానం వ్యాపారం, శ్రమించే శక్తి కలిగి ఉన్నప్పుడు, ఆమె

---

2. ఈ విషయం గురించి మరిన్ని వివరాలకు రచయిత వ్రాసిన "ఔరత్ ఔర్ ఇస్లామ్" అనే గ్రంథాన్ని చూడండి; పుట-29, 30),
3. రద్దుల్ ముహ్‌తార్ అలద్దుర్రిల్ ముక్తార్ : సంపుటం-2; పుట925)

జీవనానికి మరో మార్గం లేనపుడు ఆమె సంతానంపై ఆర్థిక బాధ్యత 'వాజిబ్' అవుతుంది. ఇక్కడ ఒక విషయాన్ని ప్రస్ఫుటం చేయటం ఉచితంగా భావిస్తున్నాము. అదేమంటే, ఫుకాహ్ (ధార్మికవేత్తలు) వ్రాసిన దాని ప్రకారం, తల్లిదండ్రులకు ఇచ్చే "నఫ్ఖా" (Maintanance)లో, భార్యకు ఇచ్చే "నఫ్ఖా" Maintanance లోని అన్ని అంశాలు ఇమిడి ఉన్నాయి.

భార్య "నఫ్ఖా"(Maintanance)లో ఏ వస్తువులయితే 'వాజిబ్'గా ఉన్నాయో, అవి అన్నీ తల్లిదండ్రుల "నఫ్ఖా" (Maintanance)లో కుమారులపై 'వాజిబ్' అవుతాయి. అంటే, అన్నపానీయాలు, వస్త్రాలు, గృహం, సేవకుడు కూడా ఇందులో చేరివున్నాయి."[1]

3. తలాఖ్ తరువాత రెండవ వివాహం కాకపోతే, సంతానం ఆమె బాధ్యతలను స్వీకరించని సందర్భంలో, తండ్రిపై ఆమె "నఫ్ఖా" (Maintanance) తప్పనిసరి అవుతుంది. ఆమె వివాహానికి ముందు పోషించిన విధంగా. హనఫీ ఫికహ్‌లో ప్రసిద్ధిగాంచిన గ్రంథం 'హిదాయ' విశ్లేషణ కర్త ఇబ్నె ఇల్‌హామ్ (ర.అలై) ఇలా ప్రస్తావించారు:

"తండ్రి వద్ద ధనం లేకున్నా కుమార్తె "నఫ్ఖా" (Maintanance) ఆమె వివాహం అయ్యేంత వరకు 'వాజిబ్'గా ఉంటుంది. ఆమె ఏదైనా పని చేయటానికి గాని లేక సేవలందించటానికి గాని శక్తి కలిగి వున్నప్పటికీ తండ్రి ఆమెను ఆయా వాటిని నిర్వహించడానికి నియమించలేడు.[2] ఒకవేళ తలాఖ్ లభించినట్లయితే 'ఇద్దత్' కాలం ముగిసిన తరువాత ఆమె "నఫ్ఖా" (Maintanance), ఆమె తండ్రిపై వాజిబ్ అవుతుంది."[3]

---

1. రద్దుల్ ముహ్‌తార్ అలద్దురిల్ ముక్తార్ : సంపుటం-2; పుట 933.
2. మహిళ ఏ యే పనులు ఏయే పరిధుల్లో చేయగలదు అనే విషయంపై మేము "ఔరత్-ఇస్లామీ ముఆషిరమే" అనే గ్రంథంలో సవివరంగా చర్చించాము).

తండ్రి లేనట్లయితే ఆమె బాధ్యత ఆమె దగ్గరి 'మహ్రమ్' (వివాహానికి నిషిద్ధమైన బంధుత్వంగల) వ్యక్తిపై ఉంటుంది. ఉదాహరణకు పినతండ్రి, సోదరుడు మొదలుగు వారు. వీరు ఆమె బ్రతుకుదెరువుకు బాధ్యులు. వీరిలో ఎవరూ లేనపుడు లేక ఆమె స్వతహాగా బ్రతుకుదెరువు బాధ్యత మోయలేనప్పుడు ఇస్లామీయ రాజ్యం ఆమె బ్రతుకుదెరువు బాధ్యతను స్వీకరిస్తుంది. ఇస్లామీయ ప్రభుత్వం లేనిచోట అక్కడి ముస్లిం సమాజంపై ఈ బాధ్యత మోపడుతుంది. భారత ముస్లిం సమాజం ఇలాంటి స్త్రీల సమస్యలను తీర్చాలని భావించి నట్లయితే పరిష్కారం లభించగలదు.[4]

ఈ సమస్యపై అభ్యంతరాలపై అభ్యంతరాలు చేసే వారందరికీ ఇస్లామీయ షరీఅత్‌లోని "నఫ్ఖాత్ చట్టం" (ఆర్థిక బాధ్యతల చట్టం) గురించి కనీస జ్ఞానం కూడా లేదని తెలుస్తోంది. వారు దీని గురించి లోతైన, వివరణా త్మకమైన విషయాలను తెలుసుకునే ప్రయత్నం చేసినట్లయితే లాభం ఒనగూడు తుంది.



---

3. ఫత్‌హుల్ ఖదీర్ : సంపుటం-3; పుట-344.
4. ఈ విషయం ఇస్లామీయ దృక్పథంతో చెప్పబడింది. మన భారత దేశం ఒక లౌకిక రాజ్యం. ఆర్థికంగా ఏ ఆధారమూ లేని వారిని ఆదరించటం, వారి ఆర్థిక భారాన్ని మోయటం అనే విషయం దాని ప్రాథమిక విధులలో ఉంది.)

# మా నూతన ప్రచురణలు

1. బ్యాంకింగ్ ఇన్సూరెన్స్ రంగాలు ఇస్లామ్
2. బాల్య వివాహాలు ఇస్లాం
3. సందేశకార్యకలాపాలకు మార్గదర్శక సూత్రాలు
4. 99 పవిత్రమైన అల్లాహ్ పేర్లు
5. హజ్ యాత్ర
6. ధార్మిక గ్రంథాల్లో మహనీయ ముహమ్మద్
7. ప్రియమైన మీకు
8. ఇస్లాం ఆవశ్యకత
9. దివ్యఖుర్ఆన్‌లోని పారిభాషికాలు
10. ఇస్లాంలో భరణం
11. ఇస్లాం పిలుపు




**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్**
సందేశభవనం, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్
హైదరాబాద్-500 002. ఫోన్:24564583

## మా రాబోవు ప్రచురణలు



## సత్యధర్మంలో సమతా భావన



## పరదా



## బైబిల్, ఖుర్ఆన్
## & సైన్సు